కరణసహాయమున, గొంచెము కష్టమున నం దొకటియు నూడ దీసి 'ఆహా రసాయనశాస్త్రజ్ఞా!' అనుచు నిచ్చెన దిగెను.

'ఏమండీ; సరియా, పరీక్ష ?'

'చెప్పెదను తాళండి. ఈ గజములు చూచి, ఈ రెంటి కిని గల భేదము మీరు పరీక్షించుచుండుడు ఈగది లోపలి భాగ మంతయును చూచుట యైనది ఇదిగో ఈ గోడ వీధి వైపు భాగమును గూడ చూచి, నిర్ధారణ పరుపగల ననుకొను చున్నా' ననుచు బిరాన వీధిదెస బోయి ఆగోడ బరీక్షించి, ఆ సమీపపు నేలను గుర్తించి, నిదానించి చూచి లోపలికి వచ్చి, 'పటేల్‌జీ! ఇక సందేహము లేదు. అరిందమ్ యిందులో పనిచేయక పోయియే యున్నయెడల, 'ఆక్సి అసిట్లియిన్ వెల్డింగుతో', ఈ కిటికి యినుపగజములు కరగించుటయును, మరల నతుకుటయును, జేయ సమర్థు లెవరు ?' అని యా నిరూపకు డనెను.

'ఔనండీ! ఆగాస్‌తో కరగించినపుడు ద్రవభాగము కొంచెము క్రిందికి దిగజారి నట్టిన గుబురులా యివి ?'

'సరిగా పోల్చిరే—'

'కాని ఆమె నెటుల బైటకుకొనిపో గలిగెను ?'

'ఓస్—చొప్పనంటప్రశ్న; ఇంత లోనర్చినవాని కది యొక కష్టమా ? పదిగజము లూడబెరికి పెద్దనిచ్చెన సహాయ మున నామెను దీసికొనిపోయి యుండరాదా! నిచ్చెన దాపు

గురుతులు చూచెదరుగాని రండు రండు—నాతో రండు. ఈ గోడ కావలవీధి కెనను చూడగలరు' అనుచు నాయనను దీసికొనిపోయి, తా నదివరకు చూచివచ్చిన గుర్తు లీతనికిని జూపి, 'ఏమండీ, నా నిరూపణాభాగముం గూర్చి పరితృప్తిం జెందితిరా?' యని యడుగుచు, గదిలోపలికి దీసికొనిపోయి, మరల నా యినుపగజములపై నుండిన చిన్న చిన్న గుబురుల జూపుచు 'దీనితో నా నిరూపణ సంపూర్తి యైనదికదా; ఈ కిటికీమూలలను సనే ఆమెను గొంచబోయెను మీ రీ గదిలో నామె నప్పటి నుండియు నుంచకపోయియే యుండిన నీ యవాంతరము వాటిల్లకపోయి యుండునే!' అని తన మాట నిలదీసికొనెను.

వీరీ తీరున సంభాషించుచుండ, నౌకరు వచ్చి, 'గురూజీ' యని బిలచి యాయనతో నేమో రహస్యముగ నివేదింప, నీతండును యేమో వ్రాసి 'చూడు అకరాచీ, తక్షణ మీ యుత్తరము—రైలులో పోయి, చూడు—అక్కడ రైలు టపాలో వేయించవలెను సుమా; బహు భద్రము; మెయిలువాళ్లలో పడితీరవలెను......చూడు; నీవు పోవుచున్నావు గాన, మన 'యమోటాతో' పటేల్ గా రిపుడే వచ్చెదరు. వారుకోరుపని నిర్దుష్టముగా నేయవలెనని, నామాటలుగా చెప్పుము' అని యకరాచీతో చెప్పి 'పటేల్ జీ, మరి మన మిక్కడ చేయవలసిన పనిలేదు. మీ రిపుడే వీనితో పోయి, మన మిక జేయవలసిన పనులు కాయత్తపడవలెను. యమోటా

అన్నిటం జతురుపు ఇక మీ రకుగుపు' అని చెప్పి, 'అది నేను చెప్పినటుల రవానా యగునుకదా!' అని హెచ్చరించి వారిరువుర నంపివేసి తన యత్నమున దాజోయెను.

---

నిరూపణ 2

'సరోజినీ, గుల్‌నుమ్ యేమిచేయుచున్నది?'

'ఇప్పుడే భోజనముచేసి కూర్చుని గులాబీపూలు మాలగా తయారుచేయుచున్నది.'

'ఏదీ, ఆమె నిటు రమ్మను. ఆమెపేర నొక యుత్తరము వచ్చినది.'

'సరే; పిలచెదను గాని, మా అమ్మను పిలిపించరా, ఇన్నాళ్ళయినదికదా?'

'ఆలాగే నమ్మా పిలిపించెదను. మీ తాతగారింట క్షేమముగా పిండివంటలు దినుచు, నిక్కడికన్న నక్కడనే యెక్కువ సుఖముగా నున్నది గదా!'

'పోనీలెండీ; మీ రెప్పుడును ఏదో ఒక హాస్యపు మాటాడి, ఆమాట తప్పించేస్తూనే వున్నారు. ఇంకా యెన్నాళ్ళు అమ్మని అక్కడ వుంచెయ్యాలని అనుకుంటున్నారో?'

'మరి చాలారోజులు నీ అమ్మ అక్కడ వుండదులే. మంగళ్ళనుని ఆ పనిమీదనే పంపినానులే. పిలు, పిలు, గుల్‌నుమ్‌ని, త్వరగా—'

'ఎందుకూ? ఉత్తరం యివ్వండి. నే నిచ్చేస్తాను.'

'అలాగు కాదమ్మా; రమ్మను.'

'అయితే వుండండి సరి వెళ్తున్నాను?'

సరోజిని నిష్క్రమించును. మరికొంచెమునేపటికి నగ మల్లిన గులాబీపూలహారముతో గుల్ నుస్సా ప్రవేశించును.

'ఏమి బాబయ్యా, ఉత్తరము వచ్చిందట! ఎక్కడనుండి?'

'ఔనమ్మా; ఇదే కవరుఉత్తరము యెక్కడనుండిరాహో తెలియకున్నది. పోస్టల్ ముద్ర లేదు. కాని, రైల్వే మెయిల్ సర్వీస్ ముద్ర సెట్ నెం 5 రు అని యున్నది. అందువలన నిర్ధారణగా నేమియు దెలియకున్నది. నీ విక్కడ నుండగా, నీ పేర వచ్చుటచేత, సిరాజ్‌హీంస్ వ్రాసియుండును ననుకొనుచు న్నాను. ఏమో, ఏదాసికైనను మంచిది. నేను పరీక్షించి, అందున్న సంగతులు చూడకయే నీ కిచ్చివేయుదును.'

'మీరుచూచిన నేమితప్పు, బాబా!'

'అటుల కాదమ్మా' అని యనుచు నా యుత్తర మాత డటునిటు త్రిప్పుచు, దాని భారమును జూచువానిం బలె మరల దానిం బరీక్షించుచు, నొక నూనెచుక్క నా కవరుపై వేసి, కొంతమేల నెరపి, చూచి, ఆకవరును చింపక, దానిమూతి యంటింపబడిన భాగముపై సించుక తడిచేసి జాగ్రత్తగా దానిని విప్పి, లెస సుఖము దూరముగా నుంచి, లోన నున్నది కాగితమే కాని యింకొకటి కాదని నిశ్చయపర

చుకొని గాబోలు, యుం డుండు కాగితము దీసి, దాని కొనను పట్టుకుని దులిపి, కవరుసై తముదులిపి, యామె కొనంగ, నామెయు చిన్నగవ్వున సద్దాని దమకమున నందికొని, త్వరగమనమున లోనికి బోయి, మూకమ్మను జదువుకొనుటకు బూర్వము సంతకము జూచుకొని, విస్ఫారితముఖముతో, వుల కాంకితతనూలతతో, నానంద వికసిత నయనాంబుజములతో, నుత్తర మెల్ల మెల్లగ జదువుకొని, నం దేమి బోధించుకొనెనో గాని, యానందపారవశ్యమున నన, మరలచావడి కరుదెంచి, 'బాబయ్యా, మీ అల్లుడుగారు బయలుదేరి వచ్చుచున్నా' రనెను.

'ఏదమ్మా, ఇటుతే—ఊఁ—పోనీ, నీవే చదువు—వింటాను.'

* * * * *

ఆఁ—ఆఁ—అరిందమ్, ఆగు మాగుము! ఎక్కడినుండియో వచ్చిన యుత్తరము, కాదు—కాదు—సిరాజ్‌హీన్ వ్రాసె నని, నీ వసిన యుత్తరముపట్టుకొని, 'ఏదమ్మా, చదువు; వింటాను—' అని గుల్‌నుమ్ ఉత్తరము చదువుచుండగా తిరుబాటుగా వినవలె నని యెంచుచున్నావు కాని, మా కొక విషయము చెప్పవలెనని న్నా యుత్తరము విననీయుము. మరియు గుల్‌నుమ్‌ను చదువనీయుము. నీ పనులును, నీ నిరూపణకార్యములును, నీయంతట నీవు చేసుకొనిపోవుచున్నావు. నిన్నను

సరించి పోయినచో నన్నియు దేటపడగలవని గాబోలు, నేది యు నడుగక, నీత్రోవను బోవుచున్నావు. ఏ రీతుల జరిగి నదో, వివరముగా, నేదియు జెప్పవైతివి. మాగ్రంథకర్త యై నను జెప్పడాయెను. పోనీ యని, నీవాటగు సర్కిల్ ఇన్ స్పెక్టరు మొదలగు నీ పరిజనులనైన నడిగి దెలిసికొంద మన్నను, కాలూరాయి ని న్నధిక్కరించి తప్పించుకొనినదాదిగా వా రేరీ, ఎందును గానరారైరి. పోనీ, నీవు చెప్పినను, జెప్పకున్నను, ఇంతవరకును మీమీ చరిత్రల దా నేర్పినయట్టుల, నోపిన రీతిని, మా కెరుకసేయుచున్న పాప మీ గ్రంథకర్తనే యడుగుద మన్నను, దన కలమును వడివడి బోనిచ్చుచున్నాడే! ఇం కెటుల? మా కెన్నో సందేహము లున్నవి. కాలూరాయి యెంతో నేర్పరియు, బహుమేధావంతుడనియు, నక్కడక్కడ నుడివియుంటివే! అరిందమ్, నీ వట్టి దుస్సాధ్యు నెట్టుల బట్టితివో చెప్పవైతివే! మా మానసకాసారముల నీ సందేహపవనము కలతవెటుచున్నది. ఇంకను మేము వేచియుండలేము. ఇక మా కోపిక చాలదు. పోనీ ఇపు డా గుల్ నుమ్ చేతి నున్న యుత్తరము వచ్చిన సంచి (కవరు) నంతసేపు బరీక్షించితివే! ఉత్తరమో, అందలి యంశములో యేవియు నక్కరలేక, పోస్టుముద్రయా నీకు గావలసివచ్చెను? నీ వేల నా కవరుపై తెలబిందువు నెరపి, ఎంతో బరీక్షించి, దానిని చింపక, దాని మూతిం దడిపి, మెల్లన దెరచుచు, నీవు పెదమోమున నం

దున్న కాగితముం దీసితివే! ఏమి, ఏల నంత జంకు నీకు? ఇందు గల విశేషము మొదట మా కెరుకపరచి, మేము బరితృప్తిం జెందినపిదప సుమా, నీ గుల్‌సుమ్ ఉత్తరము చదువుట—నీవు వినుట—ఏమి, చిరునగవున జూచుచున్నావు?

ఓహో! లోకములో జను లాత్మకృత్యంబుల మఱువజాలరుకదా! అలనాటి నీ ఇన్‌ష్యూరెన్సు కవరుసంగతి యింకను మరవు గా లేదు కాబోలు ఇంతకును నీకును మాకును మరపురానిదే అది! నీ వపుడు కాలూరాయిని పట్టుటకు రూ. 1,116 ల కరెన్సీనోట్లు గల కవరది యను భ్రమ గొలిపింప నేర్పుమెయి నంపిన ఇన్‌ష్యూరెన్సు కవరులో, చిక్కని నేతగల పట్టుసంచియు, దానిచుట్టును గుల్లదారమును, వీనినిండ రెప్పపాటు కాలమున బని సేయుగల విష వాయువుతో, నీ వానాడు నింపియుంచి పంప, పాప మాతడమాయికముగ దానిని చింప, నం దున్నని తెగి, ఆ వాయువు నాతని నాసాపుటముల బ్రవేశించి, వాని నున్మత్తుగా నొనర్ప, నాపట్టున వాని బట్టిన ఘట్టము మఱువమియా! మరి యామాటయైన నోట ననవైతివి. నీపనుల జూచి, మము బోల్చికొను మందువే? మేమందరము నీయంతవారము కాగలమా? సరియే—పాప మెంత యాతురమున నాయుత్తరమును వినదలంచితివో; అడుగుమడుగుము—గుల్‌సుమ్‌ను—ఆ యుత్తరము చదువుమని—

* * * * *

'ఏదమ్మా, చదువు; వింటాను.'

'తమరే చదువవచ్చును.' అనుచు నాలేఖనందిచ్చెను.

కమ్మం జదువుకొని, యాతండును చిర్నగవున, అమ్మా ఈకమ్మలో ఉజ్జయిని అని యుండుటచేత, ఉజ్జయినినుండి వ్రాసినటుల నున్నది; కాని తారీఖు లేదు మరియు, నాతంతి వార్త అందినతర్వాత, తాను వ్రాయుటకు దిగినంత వ్యవధి యున్నటుల గానరాదు సంతకమును, దస్తూరీయును, ఆయన వియుం బోలియున్నవి'

'ఏమి, తామటుల సందేహించుట? స్వకుటుంబ విషయములఁగూర్చి గూడ, తమ నిరూపక సామర్థ్యంబుల జూపుచున్నారుగదా యని విచారించుచున్నాను'

స్వగతమున, 'అన్నా, ఈమె మనము నొచ్చినదియై యుండనోపు.' ప్రకాశముగ, 'లేదమ్మా, నే నేమియు సంశయించ లేదు, నాతంతివార్త నందుకొనినపిదప, నీ యుత్తరము వ్రాయుటకు తగినంత వ్యవధి లేదేమో యనియు, నీయుత్తరమున నుండిన కవరునిమీద 'ఉజ్జయిని' ముద్రలేక, 'సెట్ 5' అని రైల్వే మెయిల్ సర్వీసు ముద్రమాత్ర మున్నదే యనియు. ననుకొనుచున్నాను గాని మరేమియు లేదు. ఐనను, నాతంతి వార్త నందుకొనిన తక్షణమే బయలుదేరుచు నిది వ్రాసియుండ వచ్చును, ఆ సమీపమున నున్న మరియొక యూరనాగుచు, నీ యుత్తరమును రైల్వే మెయిల్ వాన్‌లో వేసియుండవచ్చును కావున నిం దేమియు ససందర్భము లేదు.' అని సమర్థించుకో బ్రయత్నించుకొనుచు గాబోలు పలికెను.

'సరేగాని, బాబయ్యా, వారువచ్చే తారీఖు మాత్రము తెలిసినదికాదు.'

'అయ్యో, తెలియుటేమి? ఎల్లుండి' అని వ్రాసిరే! మొన్నటి దీయుత్తరము అనగా నేడే యనుటకాదా! ఈ సాయంత్రము 6 గంటలబండి వేళకు మనము పోదము. నీవును సిద్ధముగ నుండుము.'

'బాబయ్యా.........'

'ఏమో చెప్పబోవుచు, సంశయించుచున్నా వేమి?'

గుల్‌సుమ్ వినమితవదనయై మిన్నకుండెను.

'ఏమమ్మా, దుస్తులను గూర్చి యాలోచించుచుంటివా? అమ్మా, తమిజుద్దీనును, నన్నును సమభావమున జూచుకొను నీ వేల నిటుల సంశయించుట!'

గుల్‌సుమ్ మారు పలుకలేదు

'గంట గంటన్నరలో నీకు దగిన దుస్తులు రాగలవమ్మా అప్పుడే పురమాయించినాను. నీ వివాహమునకు పూర్వము నీకు దుస్తులు తయారు చేసినవాడే — కాని, వచ్చుచున్నానని వ్రాసియు, వచ్చినతరువాత, నిన్నును, నన్నును, చూడక పోవునా? చూడకపోయినచో, దానికతడు రాబనియేమి? మన లను గలసికొనుటకును, మాట్లాడుకొనుటకును, కష్ట సుఖములు గలపోసికొనుటకును గదా రమ్మని తంతివార్త నంపితిని. ఇట్టి పట్టున, నిన్ను వచ్చి తన్నెదుర్కొనగోర నేల?'

గుల్‌సుమ్ ముసిముసినగవున మిన్నకుండెను.

'ఔనును; తా నూరలేనితరి; నీ వాపత్సమయమున దైవోపహత వౌట, నిన్నెంతటజూతునా యని తహతహం పడుట నిట్టుల వ్రాసియుండు. ఆహా? ఏమిఅన్వ్యాయసామర్థ్యము.'

గుల్‌సుమ్ మోమున నునుసిగ్గున, శేనగవున, నచ్చటు వీడిపోవుచుండ, 'అమ్మా, ఆయన తొందరయు, నాందోళనయు, దమకమును, మన మిర్వ్వరమును బోయి జూతుము గాక! నీవుమాత్ర మీ యుత్తరమున నున్నటుల నచ్చటి కొంటరిగ బోకుమా! ఆయనయే వచ్చి మనలను చూడవలె నంతియ గాని, మనముగాపోవలదు— చూదుముగాక, ఆయన తొందర!' యని యాయన బలుక, నియ్యమయు నగవు మొగమెల్ల నల్లికొన, లోనికేగెను.

* * * * *

'ఏమైనది లాల్‌చంద్ కేసు?'

'ఆప్రశ్నకు జవాబుగా మరియొక ప్రశ్న మిమ్ములనడుగ వలసియున్నది. 778 ఏడీ?'

'ఎక్కడికి వెళ్ళినాడో; ఇక్కడికి రాలేదు.'

'సరేగాని, వాడీసారి మీకు కనపడినప్పుడు, మరువక, తప్పక నావద్దకు పంపవలెను.'

'అలాగే—గాని, మరేమయినా విశేషములా?'

'అన్నీ పశేషములే!'

'వేరు విశేషములా? ఈ 778 తో సంబంధించి యున్నావా?'

'ఆఁ—778 యే—వాడే లేకున్న, లాల్ యింట్లో చోరీయే జరుగకపోయియుండును. దీనికంతా వాడే గ్రంథకర్త.'

'ఆ! ఏమది!! వింతమాట లాడుచున్నారు!!'

'మీకు వింత; నాకు వింత; లాల్‌కో వంత!'

'ఔనులెండి-ఏదో కొంచెము సూచనగా చెప్పరాదా?'

'సూచనగా నేమి? పూర్తిగానే చెప్పవలసియున్నది. కాని ఇప్పుడేమియు నన వలనుపడదు. వేయేల! వాడే లేకుండిన, నింతవరకు ఘోర నేరములే జరుగకపోయియుండును.'

'అటులనా? అబ్బా! ఏమియాశ్చర్యము!'

'ఇదే ఆశ్చర్యకరమైనదో—

(1) పోలీసుస్టేషనులో మనమిరువురమును 'జగొమూర్' అను సంతకముతో వచ్చిన యుత్తరమును గూర్చి యోచించి, నేను 12 గంటలు ఆప్రాంతములో లాల్‌చంద్ యింటికి వెళ్ళి, అదివరకే, అక్కడ పెట్రోల్ చేయుచుండుటకు నిర్ణయించ బడిన మంగళ్సేన్ మొదలగువారిని కలిసి చేయుదునని, నేను మీతో చెప్పుచుండగా, అప్పటికి మనవద్దనే యుండి, వినుచుండిన 778 తనకు సెలవు కావలెననియు, జబ్బుగానున్న తన భార్యకు మందును మాకును చూచుకొనవలసియున్న దనియు, తన కారాత్రి ఆఫ్‌డ్యూటీకూడా ననియు చెప్పి, మీవద్ద సెలవు

తీసుకునిపోయినవాడేడీ, మరి రానేలేదే, ఆసురసినము వరకును? ఇందు కేమందురు?

(2) నేనారాత్రి మీతో ఏదో ప్రసంగవశమున, మాటల ధోరణిని స్టేషనులో నుండిపోయి, నియమిత కాలమున కక్కడికి పోకపోవుటవలననున్నూ, మన నియమిత కాలము వానికి దెలియుటయున్నూ, కారణములు కావా? నా కార్నుకూడా వాడు వాడుకొనుటకు అవకాశము కలుగుటకు లేదా? ఆ హైర్నుగల మరియొక కార్నైనను వాడుకొని, అది స్టేషను దారిని లాల్ యింటికి తీసుకొని పోవుటయున్నూ, వాడు కారకుడుగా నుండుటకు గాని సహాయకుడుగా నుండుటకు గాని, నమ్మతించి ఊరకుండుటకుగాని, అవకాశము లేదా?

3. మరియును, లాల్ టెలిగ్రాము యిచ్చి, మనవద్దకు తిరిగీ వచ్చినప్పుడు, అతనితో వీడును వచ్చియున్నాడు. మీరది కనిపెట్టనూ లేదు; నే నెక్కడనున్నూ చెప్పియుండనూ లేదు గాని అప్పుడు నా సంశయము ప్రబలమైనది.

4. ద్రోహి నూపరింటెండెంటు రూపముతో వచ్చి, నన్నున్నూ, షైల్లాకున్నూ, రివాలుడులో నుంచుమని చెప్పినతోడనే అదివరకే ప్రబలమై యుండిన, నా సంశయము మరింత వృద్ధియై స్థిరపడినది.

5. అనంతర మొకతూరి—మీ కెరుగనే యెరుగరు, చూడండి—ద్రోహిని మేము పట్టి తెచ్చిననాటి రాత్రి, నేను

టెలిఫూన్‌లో పిలచి స్టేషన్ రైటర్‌తో మాట్లాడి నప్పుడు, ఆర్డర్లీ సైకిల్ కాన్‌స్టేబిల్‌ని పంపుమని కోరగా, ఆర్డర్లీ మరియొక డుండగా కూడ, తానునా వద్దకు వచ్చినాడు. అప్పుడు, 'వరే నీవా ?' యని నాయనుమానము దృఢీకృతము గావించుకుని, ఇంకేమగునో చూతును గాక యని నే ననుకొని వానిద్వారా తంతివార్త నంపితిని. కాని అందువలన నేమియు తేలలేదు.

6. ఆఖరికి ఒక చమత్కారము జరిగినది. 'గుల్‌సుమ్ యిక్కడ నున్నది; నీవు బయలుదేరి రావలె' నను తంతివార్త నంపుటకు స్టేషనునుండి ఒక కాన్‌స్టేబిలు నంప గోరగా మరల నీ 778 యే, నాయెదుట తయారయినాడు. అన్నా, ఇది బాగున్నది కాదురా యని, వాని నంపివేసి, మరియొకని ద్వారా పంపినాను. కాని—చూడండి, వాని ఉబలాటము! పిమ్మట నాకు రసీదు తెచ్చియిచ్చినవాని నడిగి తెలుసుకుంటిని. వీడును వాడును గూడ కలిసియే వెళ్ళియుంటిరట—నా మనోక్షేత్రమున నదివరకే నాటబడిన యనుమాన బీజము మొక్కయై, చిగిర్చి, వృద్ధియై, పూచి, కాచి, ఇపుడు ఫలోన్ముఖమునకు వచ్చియున్నదని తోచుచున్నది. ఏదో ఫలితము దేలుటకిక నంతగా నాలస్యము లేదని దలంచెదను. కాని నేను కోరగనే, ఆర్గురు కాన్‌స్టేబిల్సు తుపాకులతోనున్ను, ఇద్దరు బేడీలతోనున్ను నే నెక్కడనుండి టెలిఫూన్ చేసినను, నావద్దకు పంపవలసియున్న మీరును హుషారుగానే యుండవలెను.'

'సరే—ఆలాగే చేయుదును గాని, సిరాజ్‌హీన్ పేర మీరంపిన తంతిసందర్భములో, వీని నెటుల సంశయించ గలుగుచున్నారు ?'

'ఇవు డిపుడే సిరాజ్‌హీన్ సంతకముతో నొక యుత్తరము గుల్‌నుమ్ పేర వచ్చినది. దాని పోష్టుముద్ర నాకు సందేహ కారణము; అందున్న సంగతులు విన్నారా ? ఎంత చమత్కారమో ! తాను వచ్చుచున్నాడట కావున, తన నీమె స్టేషను సమీపమునసున్న రాజకుమార్ రెస్టు హౌసులో కలుసుకొనవలెనట. ఎందుకో ? వచ్చేవాడు రాడా; చూడడా ? చూచుటకు గాకున్న, నిం కెందుకు తనరాక ! ఊరి ముందరకు వచ్చినకొలదిని, ఉరుకు లెక్కువ యనునటుల నున్న దీ తొందర—ఈ తమకము—ఈ తహ తహ! నా పెల్రిగాము చేరిన పిమ్మట, తాను బయలుదేరుచు నీయుత్తరము వ్రాయుటకు తగినంతవ్యవధి కలదా యని నా సంశయము.'

'ఔను—కావచ్చును మీరు చెప్పిన దంతయు పూర్వపక్షము సేయ బ్రయత్నింపను కాని, ఎమీా, తాను వచ్చుచు, దన భార్యను జూడ గోర్కెయుండ, తాను రైలు దిగినతో డనే, త న్నెదుర్కొన జూచువేడుక యుండరాదా! అం దేమి యసంగత మున్నది? మరియు నుత్తరము టపాలో వేయునంతే మైన నసన్యాయము గాదే ! ఏదీ దానిముద్ర? '

'Set No. 5 (సెట్ నెంబరు 5) అని యున్నదిలెండి.

అది ఉజ్జయిని సర్క్యిల్ తాలూకు నెంబరే. అందులో నేమియు సంశయము లేదు. కాని యీ యుత్తరమే అసంగతమనియు, అనన్వయమనియు నే దలంతును.'

'ఏమో; చూడవలసియున్నది!'

'ఔగాని, డిపార్టిమెంటులుగా మన మిచ్చిన టెలిగ్రామునకు సూపరింటెండెంటుగా రేమనిరి?'

'ఆయన రా వీలులేదనియు, డెప్టీ సూపరింటెండెంటు గారిని చూడమనియు, తంతి వచ్చినది. అయనయును వచ్చి, వివరములు కనుగొని, ఎంక్వైరీ పూర్తిచేసి, ద్రోహినిపట్టి తనకు తెలియజేయుమని చెప్పిపోయిరి'

'సరే. కాని, మీ రొకసారి నాతో మా 'ఔట్ హౌసు'కు వచ్చినచో, మరియొక విశేషముచూపెదను'

* * * *

'ఇతనెవరు?'

'చూచినారుకదా! అటు పదండి; సంగతి సాలీవులా కముగా, అంతా చెప్పెదను.'

* * * *

'చూచినారుకదా; వీడు అసలుకే మొనరు పెట్టిన వాడు. జుమీలియూకాలమున నుండిన—ఇప్పు డీ సర్కిల్ లో లేడుగాని—జత్తిబాబుకి బాగుగ తెలుసును'

'జత్రీ బాబు సరసపుంజట్టీలో బాగుగ పని చేసినవాడు. అయితే పూర్వగాధ కేమిగాని, మన ద్రోహిచేత, విఫలమనో రథు డైనవాడు; చెప్పెదను రండ' ని, తీసుకొని పోయెను.

అన్నా, అరిందమ్! నీతో చాల చిక్కుగ నున్నది. ఎక్కడికో దీసికొనిపోయి నీ వా సర్కిల్ ఇన్‌స్పెక్టరుతో మాట్లాడనేల? మేమును వినిన దప్పా? పోనీ లే; ఆ కరీమ్ ను లాబ్‌సిం గయి, జుమలకాలమున చేసిన కార్యములును, ఆతని నిజనామమును, మే మెరుంగుటకు 'నేనే' యను గ్రంథము లేకపోలేదు లే! ఆతనితో ప్రసంగ మంత మయినపిదప, మరి యిటురాక, వానిం బంపివేసి, నీవు నీకార్యములపై బోవుచు న్నావే! అన్నా! ఏదియు మొదలును గొనయు దెలియనీయవే!



# కాలూరాయి

## ద్వితీయ ఖండము

## ఎదురుసన్నాహము

### మొదటి ప్రకరణము

'సిద్ధముగా నున్నవి బాబూ, కార్లు—'

'రామకృష్ణా, ప్రస్తుతం ఒక్క—కార్ చాలు.

'అమ్మా, మనము బయలుదేరవలెను. సిద్ధముగా నున్నావా?'

గుల్‌సుమ్ ఒక మాణిక్యపు బొమ్మయై, అరిందమ్ యెదుట నిలచెను. ఈమాణిక్యపుబొమ్మను వర్ణించుచు నొక్క వాక్యము వ్రాయుటకై నను వలనుపడనీక మాకలము ముందు కథకు బరుగిడుచున్నది. అదో, ఏమో అరిందమ్ ఉల్లాసమున నున్నాడు—'యేస్, ఎగ్జాట్లీ! సరిగా నేననుకొనినట్లే అమరిన దమ్మా ఆ గౌను—ఆ అంగు అంతాను; నేను ముందుగ పోలీసు స్టేషను తెన్నునపోయి, రాజకుమార్ రెస్టు హౌసు

పడమటిదెస, మధ్యాగదిలో నుందును. కార్ మరల రావేగమే బయలుదేరుము. రామకృష్ణ నీ కంగరక్షకుడై రాగలడు'

*  *  *  *

తరణికిరణవారము జల్లారుచున్నది సుమారైదు గంటలు కావచ్చినది. వీధి వేకార్ పోవుచున్నను, తనకొరకే వచ్చుచున్నదని బైటకువచ్చి చూచుచు, మరల లోనికిబోవుచు కార్కొర కెదురుతెన్నులు సూచుచు, నాందోళనాపవన సంచలితమనస్కుడై, ఇటునటు దిరుగుచుండు గుల్సుమ్ను జూచి, మెల్లన, 'ఎందుకమ్మా, ఆతొందర?—కూర్చో—కార్ వచ్చునులే!' యని సరోజిని గేలిసేయుచుండ, 'నదిగో, రామకృష్ణో, కార్' యని పలుకుచు, పలుచని మేఘముల సందున దోబూచు లాడుచున్న చందురుని చాదాన గుల్సుమ్, ఇలువీడి కార్నధిరోహింప, మోటారునడచుచుండెను.

---

## రెండవ ప్రకరణము

---

'మారుల వైద్రిది. స్వర్ణమయి నేల యులబడి నొందించుట యుని, నన్నడుగడుగునకును నోనాడును. ఇంతకును, స్త్రీలోకమునకు వ్యక్తిసంబంధముచే, జాలివాడముట సహజమే గాని, నా యుద్దేశమును, తత్సిద్ధికొరకు నేజేయు ప్రయత్న

ములును, త త్ప్రియత్న ములు ప్రమాదరాహిత్యతయు నన్ని కావలయునా? పోనీ, దాని యుటునున కేమిగాని, వా డెంత దిట్టరి! ఆతని సిరుల సాచితి, మఱియు నాతని నాఱడి బెట్టగ నైన వారి ప్రేరేచితి; పశంకికిం దనకు బొం దెడజేసితి. ప్రేచితి; లోచితి; వెతల గంద నలంచితి; అప్పుల మోపితి; నేచితి; పెన్నట్టుల పెట్టి, తడవుల వేచి, చూచి, నుల్ల మల్లల నాడ నూచితి; నూయూరే! ఎన్నిట న్గొంగడు; ఎదం దలంకడు; బింక మూడడు; కట్టా! ఎట్టిదిట్టరి! ఐన నౌగాక గాని, ఈ యెత్తున, చిత్తమ్మున దిట్టతన మ్మూడక తప్పదు! త్రాహి త్రాహి యనక తప్పదు! అక్కఱలేని గొడవల కేగిన, పాప మిట్టియిక్కట్టులు దప్పవు. ఈ యెత్తున గుల్నుమ్, ఈవల నా వలం బడకతప్పదు; అతని ప ట్టుపడగక తప్పదు—తప్పదు'

'ఆః—ఎవరది? ఓహో, మీరా! వాః—సరిగా నమ రినదే! ఇ దెవరిపని? యమోటాదా! వా డెక్కడ—జపాన్ సొగసు, జపాన్ చేసాపు, జపాన్ నేర్పును ప్రదర్శించినాడు. సరే—వదండి. మీ కది యమరిగా నా కేనా యిది యమర లేదు. మీ నౌఖరుగా నేనును లేనా? అన్నియు బాగున్నవి గాని, సభా పిరికితనమును, మీకు కావలసిన గుల్నుమ్తో మాట్లాడుటకైనను సిగ్గును, మీకు లేకున్న, మన ప్రయత్నమున నిస్సంశయముగ మనకు జయము కలుగక తప్పదు.'

'ఏదో యొకవంక నెంచవలెననే యుండునా యేమి?'

'ఉన్న మాట కుమకేల ? అది సహజమే యనుడు.'

'నే నేమియు ననను; ఏదో కార్యము ననివార్యముగ జయ మందజేసిన, మీ రనుకొనినదానికన్న నే నన్నదానికన్న, నేను మఱుంగు లధికమా తెరంగున సంతోషపెట్టెదను.'

'ఔనౌను; మీమాటన మట్టిదే! కాని మన మెక్కడికి పోయినను, మీ రేమియు మాటాడవలదు. నా వెంటనంటి వచ్చుటదక్క మరేమియు చేయనక్కరలేదు. తడవులం బట్టి అవసరమైన మాటల చెప్పుచుందును. మీ కవిత్వములును, మీ పాండిత్యములును గట్టిపెట్టవలెను.'

ఏ రిరువురును ప్రయాణమై పోవుచున్నారు.

* * * *

'ఈ పురసౌధముల నున్న కామినీజనముల జూచియే, కాళిదాసు చెప్పియుండునని దోషింప, నాహా! ఏమి యీముద్దు గుమ్మల యందము!

'శ్లో॥ గేహే గేహే జంగమా హేమవల్లీ—'

ఏకార్థనము పేతులై, వడివడి నడచుచున్నారు.

(తనలో) 'ఏదో; ఈ పెర్రి అణగినతర్వాతనే ఆయను—'

'వల్ల్యాం వల్ల్యాం పార్వణ శ్చంద్రబింబః'

(తనలో) 'అన్నా, ఈశ్లోకమంతా పూర్తిగా చదువును గాబోలు వేళ యయిపోవుచున్నది. బోలెడుదూర మున్నదే.!'

'బింబే బింబే కోకిలానాం విరావో,

'రావేరావే' మన్మథః పంచబాణః.

'దీని వ్యాఖ్యలోకూడా.........'

'ఆఁ—ఆఁ ఆగండి; ఆగండి. ఈ గొడవతో వేళ మించిపోవును. మనము పోవలసినదూరము యెక్కువ; మీ మోహావెఱ్ఱియు నెక్కువయే. అన్నా, చిక్కగా నున్నదే! ఇక్కడా శ్లోక మెవ రెఱుగరు? కిక్కుమనక పదండు. పోదము—'

వారి గమ్యస్థానము జేర నెంతో బిరీన నరుగుచుండిరి.

* * * *

ఏమి! బండ్లు—మోటారులు—ట్రాములు—

* * * *

'గురూజీ, గురూజీ, చూడు డీ దెస మోటారు!'

'ఆఁ—చూచితిని, మరి నీవు గోకవలదు. గుర్తించితిని. మరి సంశయములేదు. జయ మరచేత నున్నది. పక్కను ద్రొక్కివచ్చిరి. మరి యాందోళన వలదు.

(తనలో) 'ఔరా! ఇక జిక్కితివి!'

వడివడి నడచుచుండిరి.

| | | |
|---|---|---|
| సాయంకాలము<br>6 గంటలు<br>ఇంకను కాలేదు | మోహా<br>రంగము | రైల్వే స్టేషను సమీపమున<br>రాజకుమార్ రెస్టుహౌస్ |

'వహావ్వా! వహావ్వా!'

ఉ. 'దాని ముఖప్రభాగరిమ, దాని కపోల కళా విశేషముల్

దాని బెడంగు చూపులును దాని.........'

'ఆఁ—ఆఁ—ఆగవయ్యా, వద్దనుమా—కొంతముం చేటట్టున్నది మీ అల్లర — మాట్లాడకూడదు — అంతా స్వగతమే యని యెంతచెప్పినా యింతే!—మరి నావీవు గోక వద్దు—ఔను, చూచినాను — మీరిక్కడే ఉండండి; సంగతంతా మినిట్లమీద నున్నది—పది అడుగులే!—'

* * *

'జగద్విఖ్యాతి గలవాడ నని యనుకొనుచున్న ఓ అరిందమ్! ఇంకెందుబోగలవు! ఇక నీకు తెరువెయ్యది? నిన్ను జితోస్మి యనిపించుటకును, నేను కోటీశ్వరుడ ననిపించుకొనుటకును, బద్ధకంకణుడనై మహానాటక మాడించుచున్న నన్నెమరతివో! కాక మరచితివో! నీ కుశాగ్రబుద్ధి యబద్ధమైనదే! నీ 'మేధ' వ్యర్థమైనదే! నీ నిరూపకము లెల్ల నిరూపకములైనవే! నీ ప్రతినకు గతియేదీ! ఇక నా కోడితివని యననగును గదా! న న్నొకతూరి బంధించితి గదా యని యందువేమో! కపటమార్గమున కదా! అ ట్లయ్యును మిమ్ముల నందర చిత్ర ప్రతిమల జేయు తెరంగున నెగిరిపోతినే! నను బట్టితి గదా యను నానందమున, నీయిలు జేరి, నీ యూడుదాని కొరకాదు దానింబలె, బంలోదనమునేసియు, ననుగీర్తించియుండలేదా! రేలుంబవళ్ళుల భేదముల మరచి, గంటల గమనించలేక, ఒక దాని కొకటి యనుకొని, ప్రవర్తింపలేదా! నా సమయముల రెంట నొకటి నెగ్గినది కదా! ఇక నున్నది నేటితో నాకోటి బూర్తియగుటయు, తన్మూలమున యోగిని యాత్మకు శాంతి

కలుగుటయున్నే కదా! నీ సమయము లన్నియు నిక నీ సమయమున చూచెదగాక! ఇక నేజేసెద నన్నను, జేయునది లేదు. ఇక నాచేతల నెన్నలేవు——ఇక నా కృత్యముల గాంచలేవు——మరియు, నావలు కాలింపలేవు ఇదియే నా కడసారిపని——'

* * *

'ఔరా! ఏమి దీనియందము.

శా. 'చెండ్లా గుబ్బలు, జాళువా తళుకులా చెక్కిళ్ళు, డా
ల్నింగిణీ తో, విండ్లా కన్బొమ, లింద్రనీల మణులా వేణీ
రుచుల్, తమ్మిలేం, దూండ్లా బాహువు లింత చక్కదన
మెందుం గాన, మీజవ్వనిం, బెండ్లాడం గనువాడు చేసి
నది నుమ్మా భాగ్య మూహింపగన్'

ఆహా! యీ మాణిక్యపు బొమ్మకై నా సర్వస్వముం గోలు పోయినను నాకేటిలోటు!

సీ. 'చెలియ పెన్నెరి గుంభుం జే పట్ట గలిగినా,
ఘన సంపదలు వేడ్క గాంచినట్లు;
కాంత మోమున మోము గదియింప గలిగినా
యతులిత రాజత్వ మందినట్లు;

ఊరక పూర్వకవుల నిందింతుము గాని, భావము లన వారి సొమ్మా! ఆహా! భావ యున, వారిదే!

ముద్దియ కన్దోయి ముద్దాడం గల్గినా,
యింపుమై గువలయం బేలినట్లు;

వనిత కంఠాశ్లేష మొనరింపఁ గల్గినా,
యరుదార పెన్నిధి యబ్బినట్లు;
తే. గీ. కలికి కెమ్మోవి చవిఁజూడ గలిగెనేని,
యురు సుధాహార వైభవం బొందినటుల;
నెలతతోఁ గూడి క్రీడింప గలిగెనేని,
యతను సామ్రాజ్య మంతయు నమరినట్లు'

ఆహా! ఆ నిలచిన యౌవనమున కేనే మిచ్చినను దనివి తీరని యీ జగన్మోహనాకారి అదే,

ఉ. 'నాదెసఁ జూచుచున్నది, ఘనా ఘనబృందసమానకుంతలా
చ్ఛాదితనిష్కళంక ముఖ చంద్రకళల్ వికసిల్లఁగన్, శిలా
వేదికఁ గేలుమోపి వలపించెద రమ్మను నట్లు, కాముసం
పాదిత మోహపాశముల వైఖరి రాజిలు దృక్పరంపరన్.'

ఆఁ—ఏమిది! గురూజీ ఇంకను రాకేల? బహుశః సానమందును, రసమును, బసరును, ఘన మణిమంత్రౌషధములును, గైకర్ణిక కావును, గుళిక, మూలిక, బూతియు, దవిలిచిదే నాలోచించు చుండునా? కాని నాడేల యింత యాలస్యము? గొంతెత్తి బిలచెదనా?—గురూజీ!—కాని మిమ్మించుక వేచి నేనే స్వయముగ బోయెద—కాని,

క. 'కమలంబుల కమలంబుల,
గమలానన లోచనములు కాంతి జయించుం,'

* * *

'అన్నా! నేను జేరువ యైనకొలదిని వీని యుబలాట మధిక మగుచున్న ట్లున్నది—అబ్బా! పిలచుచున్నాడే! అన్నా!—ఏమి చేయను; కొంప మునుచునాయేమి! వాని నూరకుండ జే సాజ్ఞ చేసెదను.'

'ఏమిది?—అయ్యో, సాధ్యము కాలేదు గాబోలు! మాటాడిన రసభంగ మౌ నని, చేసాజ్ఞను రమ్మనుచున్నారా! ఇదో వచ్చుచున్నాను.'

* * *

సమీపించుచున్నాడు.

* * *

'గురూజీ—తమరే—పాపము—ఘోరము—

'దూతి త్వమాకృత మహో నిఖిలం మయుక్తం
సత్వాద్భశి పరహిత ప్రవణాం ఉస్త్రీర్లోకే.'

యనునంత పనిజేసిరే! అబ్బా! నాకొర కేగి, స్పర్శ సుఖమైన బొందుదు గదా యని, ఏరా, యింత లోనర్ప మేరా నీ?' కని దీవ్రమున నాతని చేయి నొక యోరకుం ద్రోసి, తన రెండవచేతితో నామె కరమును బట్టబోయెను. సరి—యిరువురును — ఇంక నవ్వాలికథ నెవ్విధి వ్రాయగలుగుట! వ్రాయక యూరకుండు టెటులు? ఇక నేమి వ్రాయుదుమన్నను కలము సాగదాయె; వ్రాయకున్న, మా చదువరు లూరకుండరాయెను; ఏమిసేతుము' అఁ—ఇంతకును మాకాభార

మక్కర లేకుండగనే, వారిరువురిలో నొక రేమోయనుచున్నారుగదా; అటు వినుడుమా!

'అన్నా, అరిందమ్! ఇదిమావని! నీమగటిమకి దగని పని; ఘూటాకోరులకును, బద్మాషీలకును లక్షణమును, బహాద్దూరీయును నగు నిట్టికార్యము నీపుట్టినానికి దగనిపని యని ముమ్మారు గొంతెత్తి సాటగలను. అబ్బా! మొండికత్తితో గొంతుక తెగనరకుచున్నావే! ఒక్కసారిగ నీబేటరీకి ఫుల్ పవర్ నైన నిచ్చివేయుము. పశుబలమువంటి యీ విద్యుచ్ఛక్తి చేపట్టినందుల కెంతేని స్తుతినీయుచవేగాని, శారీరకమగు నిట్టి యాధిని హెచ్చింపక, మరియుమరియు, నీమేధను గనుపరుపుము, నీచేతలు బిన్నాతు కాలమునుండియు నెరింగియు, జూమలను నీవ్రబంధిచిన తెరంగనుభవైక వేద్యమయ్యె, మరల నీగోతిలో బడుట కెంత మందుడనై, యధమునైతిని! ఈ మాణిక్యపుబొమ్మను నిజముగు గుల్‌సుమ్‌యే యను భ్రమగొలిపింపదగు తెరంగున నిలువబెట్టి, కనులాడజేసి, ఎలెక్ట్రిసిటీతో చార్జిజేసి—విద్యుచ్ఛక్తిని బూరించి, ఓహో! ఈక్రింద నొంత ఇన్సులేట్ (మానవకరముల దాకుడువలనను, భూమితో నంటియుండుటవలనను, విద్యుచ్ఛక్తిపోకుండ గాపాడు నుపకరణముబరచియుండ) చేసితివి! ఎంత మోసగించితివి;...... అబ్బా! అమితమగా బాధగానున్నది......తగ్గింపుము...... తగ్గింపుము......'

'ఓహో! సిరాజ్ హీంన్ గారే! దయచేయండి; లోపలికి దయచేయండి. గుల్‌సుమ్ లోపలనున్నది. ఇంకను భ్రమ యేనా? అన్నా మరుకావము మతిభ్రమణమునకు గారణ మయ్యెనే, పాపము!' అనె నరీందమ్

'గురూజీ! మీరును భ్రమపడిరే?'

'అయ్యో. మూర్ఖుడా! కార్‌లో పోవుచున్న దానిని నీవు చూచి, నాకు చూపి, ఇటుల కోంపముంచితివి! కానిచో నీఫలితము నీకే అందజేసి యుందును.' (తనలో) 'ఈతనికి మదపిచ్చయును, నాకు ధనకాంతయు నింతకు దెచ్చినవి' (ప్రకాశముగ) 'ఐన దైనదికాని, అటో, ఇటో, ఏదోయొకటి దేల్చివేసిన బాగుండును. వాంఛాముఖమైనది. మరి బాహా బాహి లేదు; గత్యంతరములేని రాజీకాల మూనన్నమైనది. అం——తగ్గించితివే! నన్ను పట్టుట కిటుల విద్యుచ్ఛక్తి సహా యము గోరనేలయని, నిను నిందింపనులే; నా యట్టివానిని బం ధింప నింతకన్న సులభమార్గము, నీకే కాదింకెంత మేధాశాలి కైనను, లేదని నేనెరుగకపోలేదు.'

'నీ పేరును, నీచరిత్రయువిన గడుగుతూహలుడను.'

'అయ్యో. ఇంతకాలి మైనది. ఇన్నిదయైనవి. మరి నీకును నాకును జిక్కులులేవు. అన్నియు ముగింపుతరియే యిది; ఇక ప్రత్యేకమైన దాపరిక మేల;

'సర్వజగత్సృష్టి యను నీ ప్రకృతి, నాచే నాడించుచున్న నాటకంబిది యని యెరింగియు, బౌద్ధకులజుండ నౌట పరమనాస్తికుండనై, ఘనాంతస్వాధ్యాయినయ్యు, వేదాంత, మీమాంస శాస్త్రపరిజ్ఞాత నయ్యు పరంపరసి, చార్వాకమత స్థుండ నౌట బ్రాహ్మణద్వేషినై, సర్వంబును ప్రకృతిధర్మంబ యని నమ్మి, కర్మసూత్రమే జగత్సృష్టి, స్థితి లయములకా లయ మనుచు షడ్దర్శనముల నధిగమించి, చతుష్షష్టికళల నల వరచికొని, పౌరుషేయములౌ వేదము లప్రమాణంబులని గుర్తించి, నా ప్రతికార్యంబునకును నాకు బాధ్యతలేదని, యెడనెడ నెదనమ్ముచు, నా చిరుతప్రాయముననే మాతృ పితృవియోగమున నా జన్మభూమియు, సర్వసంపదల కాల యమ్మును బిల్హణ, కల్హణ, పద్మగుప్త, రత్నాకరాది సంస్కృతమహాపండిత జన్మభూమియు నౌ గాశ్మీరము వీడి, యా సేతుహిమాచలమేగాక, దేశాంతర ఖండాంతరము లౌ లాతి విలాతుల నెల్ల గరిడీముచ్చులతో డిరిగి తిరిగి, పాశ్చాత్య శాస్త్రవిశేషము లశేషమ్ములుగ నెరిగి, పదునెనిమిది భాషల బాండితీ మహిమ నొంది, కవిత్వపటుత్వసంపద నలవరచికొని, యంత్రమంత్రతంత్రముల నేరిచి, వశీకరణవేదండ మహానీదండ మండ నుండ, దిరుగుండ దని దనివారనమ్మి, ఎందరో శిష్యుల సేకరించి, మించి, నా ప్రేమకు బాత్రురాలును, రూపొం దిన యందమనదగినదియు, నిను ధిక్కరించు మేధస్సు గల

దియు నగు మారుల యును, మహారాష్ట్రాంగనను జాయగా జేరదీసికొని, గోటీశ్వరుండ నా దలంపున నేనాచరించిన పెక్కుకార్యముల కవుతవు డడ్డువచ్చుచుండిన నీవు, బహు మేధావంతుడ వని వినివిని, తొలి బిన్నాత్ చే నాటక మా డించి, పదంపడి విమలయై, ప్రవిమల యూజూములచే నీకు బుద్ధులు గరుపనెంచి, నాకర్జముల కెడనెడ నడ్డువాట్లువేయు చుండిన నీతో, నేనే స్వయముగ జేయి గలుప నిశ్చితమన స్కుండనై, నిను బ్రతారింప నమకట్టియు, నీకు లాభకారి యూనువనుల నెన్నెని వన్ని, తొలి జిగొడూర్ సంతికముతో లాల్ చందు నింట దోపిడిం గూర్చి, తగినంతివ్యవధి యుండ గనే, ముందుగ దెలియజేసి, మాయాప్రయాణస్థుల అబద్ధపు దోపిడికేసునందగా ఫిర్యాదని బోల్చికొనజాలక విచారించుచు, సర్కిల్ ఇన్ స్పెక్టరును నీవునుంగూడ తదాలోచనానిమగ్నులై యుండునటుల బన్నగించి, దీకార్ లో నేనే, నీరై పోయి, మీ యధికారవర్గమువారట జూచుచుండగనే, మీకంట దుమ్ము గొట్టి, నాకార్యమొనర్చుకొని, నెన్నెని వివరములతో మీపోలి సువారియజాగ్రత్తయు, నిరుపయోగత్వమును లోకమునకువెల్లడి జేసి, మారువేసముల నసునధిగమింప లేవనియు, నను నను గొనెన్నరదును గాంచనీకు దుర్ఘట మాట, నీచేతల నికనైన నుడుగుమని దెలియజేయుటకో యన, నేను, నూవరించెండెంటు నై, మీసర్కిల్ ఇన్ స్పెక్టరుచేత నిను రిమాండున నుంప

నియమించి, అధికారుల లోనర్చు న్యాయాన్యాయ విచక్షణయు, దోషనిర్దోషజనవివక్షతయు నొకింత సూచించి, యనంతరము స్త్రీపురుషులై ప్రయాణీకుల వేషమున, మీ మాయా వాగురం దగులజేయ నెంచి, మా గృహం జేరిన మిమ్ము, నొకింత శంకించియు హానిం జెందగనీక, లాభలేశకాంక్షతో లాల్ చందు నింట, నే నదివరకే వేసియుంచిన టైమ్ లాక్ (నిర్ణీత కాలమునకే తెరువబడు బీగము) ను దీయ, సిను గొనిపోయి, తత్కార్యానంతర మట స్థితిగతులు మించి వచ్చుటం జేసియు నిను నీవారి సామీప్యమున వీడు దలంపునను, లాల్ నింట నిను వీడి, నా చేసాపును జూపుచు, నీ సర్వస్వముం దోచుకొని, నిను నిస్వుం జేసియు, చంద్రమౌళినై, సిద్ధమైయుండిన నీ కూతుబెండ్లికై తంతివార్తలమూన రూ ౨,000 లు నీ కందజేసి, నీ కెన్నండును ద్రోహ మెంచక, నీ సహచారిణి నగౌరవించక, తన తండ్రికడ సురక్షితముగ న య్యామ న్వీడజేసి, మృతయగా ప్రథమ కళత్రవియోగానల మెరింగిన నీకు, యావనాంతమున బునర్వివాహము గమ్యపరంపరలకేగాని, సౌఖ్యములకు గాదను నీతిగరపుటకో యన, సజీవయగా ద్వితీయజాయా వియోగము గూడ కొంత ఢాకతడవు నొకింత చవిజూపి, తుదకు, నీచే గుచ్ఛితవు బెత్తుస బంధితుండ నయ్యు, ఒక్క యాడుదానికున్న పాటి తెలివితేటలు గూడ నీకు లేవునుమా యనియు, వర్తమాన శాస్త్రపరిజ్ఞానవిద్యావైశద్యములలో, నీవు నేర్చుకొనవలసిన విషయము లింకను బెక్కులు గల వనియు దెలు

వుచు, పాశ్చాత్య విద్యాప్రభావ మొకింత రుచి నూపి, మింటి కెగసి, మి మ్మందర జిత్తరువుల జేసి, నిం కిటు నెన్నియో నీ కుపకారము లొనర్చియు, నాపై గత్తిగట్టుచున్న వానితో జేయి గలుపక తప్పదుగా యని విచారించి, స్థిరీకృత మనస్కుండనై, అవివాహితగా నున్నకాలము నుండియు గుల్‌నుమ్‌ను గాంక్షించుచు, నీ కాసందర్భమున జాగీరుగా రెండు గ్రామము లిచ్చెద ననినను, ఈ జమీందార్ పటేలునకు నీ యసామర్థ్యంబు కతంబునను, నీ ధీ రహితచిత్తంబునను, నీతని కామె నప్పగింప జాలమి, నా మేధాశక్తియు, నా ధీర హితచిత్తంబును వెల్లడి సేయుచు, గుల్‌నుమ్ నీతని కప్పగించియు, నీ రసాయనిక శాస్త్ర పరిజ్ఞానమున నీత డామెం గోలుపోవ, మగుడ నీసమయమున, నీ బుద్ధిచాతురీమహాత్మ్యంబున 'మానవు నజ్ఞానచక్షువునకు గాన వచ్చున దెల్ల సత్యము యని దలంపకూడ' దని లోకమున జాటు నీ హిందూచిత్రశిల్పకళాచాతురీమహిమచునను, ఎంత వగకీలోగాని, ఈమాణిక్యపు సాలభంజిక యా గుల్‌నుమ్‌చే, నీ విద్యుచ్ఛక్తిప్రభావముచే, నేరికొరకు, చిరకాలమునుండియు, నేటివరకును, నీకు సింహస్వప్నసన్నిభమై యుండి, నా నెం. 94[illegible]7 రు మోటారు పన్నాగ మెరుంగరాకుండ జేసి, తుదకు, గ్రహచారంబుకతన నీవే—కాదు—కాదు, విద్యుచ్ఛక్తిచే దుస్సాధ్యుండనయ్యు, నీకు సుసాధ్యుండ నయిన కాలూరాయిని నేనే.

'నాకథ అంతా యింతే గాని—ఆః—ఏ మది వ్రాయు చున్నావు? మరియు వ్రాయించుచున్నావు? నేను తప్పించుకొని పోదు ననే, నీ వృత్తినైజము గనుపరచుకొంటివి గాని?—పీ రందరును నను బట్టుటకే! పాప మెన్నివిధముల జాగ్రత్త పడితివి? నీ వేమి చేయించినను, వినశ్వరమా నీ చర్మభస్త్రికే గదా! ఆత్మ అజేయమునుమా! మేధాశక్తి దుర్భేద్యమునుమా! శిక్షల యుద్దేశములును, నిర్దేశములును నన్యాయములునుమా!'

'ఇంతకాలమునకు కాలూరాయిని ప్రత్యక్షముగ జూడ గలిగినందుల కెంతేని ముద మందుచుంటి గాని, అంతివాడ విట్టిదురంతము లొనర్చినందులకు మాత్ర మేనుమహుంగులు విచారించుచున్నాను. ఇవు డీ బేటరీపవర్ తగ్గించుట నీతో కొంత సన్మార్గముం గూర్చి ముచ్చటింపనెంచి.........ఆః—ఆః—ఆగు మాగుము. తెంపరితనమా—ఇదా పని— ఆగుము' అనుచు నరీందమ్ పలుకుచుండగనే, నెంతవేగమున దీసెనో గాని, తన మొలను నలసూాకారముననున్న వఖ్యాణము వంటి కత్తిం, దొలుత పటేల్ శిరము దెగవేసి, యనంతరము —మే మిది వ్రాయుట కాలస్యమగుచున్నదిగాని—

'తొలి నీవు కుచ్చితపు తెన్నున నను బట్టి, ఠాణాలో నుంచిన రేతిరికడ, '......ఈ వొక్కరాత్రికి ఏం పడిపో యింది? ఒక్కనాటి భాగోతానికి మీానం గొరిగించుకున్నట్లు!' అని యని యుంటివి. అది యాదిలేదా? మించివచ్చిన, నవుడు

జేయదలంచుకొనిన దిపుడే పోయెను. నా శిష్యులే నీచేత శిక్షితులు కాలేదే; ఇక నేనా? భ్రమపడకుము! నీ చేతులలో నీచపుచావుకన్న.........' అని యేమో యనబోవుచు నొక్కవేటున నడికికొని, నేల గూరగను మొకట పతేలును జంప నెత్తిన కత్తిని బట్ట బ్రయత్నించ సమీపించిన రక్షక భటు లెల్లరును రక్తదర్శనమున భీతిలి, యావలకు బోయియు, మరికొందరి సాయమున నాతని సమీపింపబోయిరే గాని, ఇంకే మున్నది? ఏమి వ్రాయుటకును, దుష్టజనరుధిరప్రవాహ నిమగ్నమై, దృక్పథము దాటి గొట్టుకొనిపోవుచున్న మల్లెఖని రెయిల్ల బోవుచున్నదే గాని, యేమి వ్రాయుటకును నొల్లకున్నది.

* * * * *

ఆ రెండు మృతకళేబరములను గాపాడుటకు రక్షకభటు లాజ్ఞాపింపబడిరేగాని, ఆ సమీపమున నేరును గాపలియుండ సాహసింపజాలక, సేవకావృత్తిధర్మమున కొంకింత శిరములు వంచి, దాదాపుల నిలచి, ఎట్టెటులనో వేగించిరి.

---

## మూడవ ప్రకరణము

---

'ఓహో! మామగారు, నమస్కారము; క్షేమముగ వచ్చినారా? ఈ సాయంకాలపు బండిలోనే వత్తురని యనుకొనలేదు. మంగళేన్ తొందర పెట్టెనా యేమి?'

'లేదుగాని, ఇక్కడికే యిన్నినాళ్లయినది ?'

'సరేగాని, అత్తగారును క్షేమముగదా ?'

'దైవకృపవలన నందరును క్షేమము'

'మీరువచ్చిన బండిలోనే పండిత త్రివిక్రమరావును, చంద్రమౌళియు రావలసియుండె' ననుచు, దానును గుల్‌నుమ్ యును లోపలికి బోవుచుండ, 'ఏమోయి, బాబూ, నీముఖము మిక్కిలి వాడి, యాయాసము సూచించుచు, నీరసముగా నున్నది ?' అని కిషన్‌చంద్రసేన్‌గా రల్లుం బ్రశ్నించిరి.

'ఏమీలేదు —'

'ఏమోగాని, నీరసముగా నాయాసము సూచించుచునే యున్నది. మేము రైలునుండి వచ్చుత్రోవలో రాజకుమార్ రెస్టు హౌసువద్ద నేమో అల్లరగానున్నది. జనులు గుమిగూడి యుండిరి. ఏమా గంద్రగోళము ?'

'అయ్యో ! అదంతా మనదే; అత్తగారికి జబ్బుగా నున్న దనినీ, స్వర్ణమయిని తక్షణం రమ్మని మీరు కార్ పంపినా రనినీ నేను ద్రోహులగుహకు పోయియున్న సమయమున, స్వర్ణమయిని దీసికొనిపోజేసి, ఏదో పెద్దమొత్తు మెత్తియుండ, దా నింతలో పట్టుబడుటచేత గాబోలు, ఏమిసేయుట కును దోపమినో యన, రైలులో మీవద్దకు స్వర్ణమయి నంపి వేసిన కాలూరాయి, నేను పట్టుబడియు నాత్మహత్య గావించు కొనినాడు. అక్కడి గంద్రగోళము ఇది.'

'బ్రదికినాము నాయనా; ఇక్కడికి లోకక్షోభ మణగినది. ప్రజ లింక జల్లగ బ్రదుకగలరు.'

'అబ్బా! ఎంతమాట!! అంతవా డంతరించిపోయి నందుల కెంతేని విచారించుటకు మా రెంతమాట యనిరి!' అనుచు భార్యను చూడబోయి, 'ఇదిగో, వెనుక నేను నీతో నపుడపుడు ప్రసంగరీత్యా గుల్‌నుమ్‌ను గూర్చి చెప్పుచుండెడివాడను. ఈమెయే ఆ గుల్‌నుమ్!' అని యామె నీ స్వర్ణమయికి సందర్భపరచి, ఆ కేయియెల్ల వారివారి గత కష్టతరంగములగూర్చి ప్రసంగించుకొనుచు కాలముబుచ్చిరి.

---

## నాలుగవ ప్రకరణము

---

వేగుంజుక్క పొడమినది. అదే ఉషఃకాల మాసన్నమైనది. తూరుపుదిక్కాంత చీకటిముసుంగు నెడద్రోసి, సహజకాంతివంత మగు తన మోముదమ్మి జూపుచున్నదో యని, దోషవరంపర లెల్ల బటాపంచలై వీడుచున్నటుల, ఝల్లున దెల్లవారుచుండ, ఉజ్జయినినుండి సిరజ్‌హీన్‌యును, నాగ్‌పూర్‌నుండి పండిత శ్రీవిక్రమరావును, జబ్బల్‌పూర్‌నుండి చంద్రమౌళియు ఒకబండివెనుక నొకబండితో వచ్చి, వీధితలుపు దట్టుచుండ, నదివరకే నిదురలేచి, ప్రాతఃకాలకృత్యములం దీర్చుకొని రస్తుపశానుకు బోఁబ్రయత్నించుచున్న అరిందమ్‌యును

నాసవ్వడి విని, వడివడి తలుపుదెరచి, వచ్చినవారి కాతిథ్య మొసంగి, క్షేమాదుల బ్రశ్నించుకొని, కొంతశోకతపవు వెనుకటి గాథల ముచ్చటించి, జరిగినవిధ మెల్ల నూతనాగతులకు నివేదించి, సిరాజ్‌హీన్‌ను లోపలికి దీసికొనిపోయి, 'అమ్మా, గుల్‌సుమ్, ఇదె సిరాజ్‌హీన్! నీకష్టములు గట్టెక్కినన, జూడు మాదెస సూర్యభగవానుడును దూరపుకొండ నధిష్ఠించినాడు. మీరును మీరునుం గలసికొంటిరిగదా! ఇక నా బాధ్యత తీరినది కాని అమ్మా; సిరాజ్‌హీన్ నీపేర వ్రాసిన యుత్తర మెప్పుడు వ్రాసిరో, ఏయూర పోస్టున వేసిరో, గొంచె మడిగి చూడు' మని అరిందమ్ సూచింప, నామెయు చిర్నగవున మిన్నకుండ, గుల్‌సుమ్ విలాసముతో వచ్చిన ఆకమ్మ నాతని కొసంగ నాత డద్దానిం జదువుకొని, తన వంతకమా యని భ్రమగొలుపు నా తరుణలిగాని నైపుణ్యమును చేసాపును ప్రస్తుతించి, 'ప్రస్తుతరచనకు వీనిని మెచ్చుకొనవలసినదే; అన్నిరసములును గనపరచి వాడు; వీడన్నిటం జతురుడే, మనము నేర్చుకొనవలసినవి పెక్కులు గల' వని సిరాజ్‌హీన్ పన్మయానందముఖుడై నిలువ, 'మనము పోవలసినవేళ యైనది; రం' డని 'మంగళ్సేన్, నీవును శ్రమపడి స్వర్ణమయిని, మామగారిని దీసికొనివచ్చితివిగదా; ఇపుడు వీరినందర దోడుకొని వేగ మా రెస్టుహౌసుకు రావలెను. మరియు, మన ఔట్‌హౌసులో, జూములకాలము నుండియు నీతో బరిచయము గల గులాబ్‌సింగ్ వురఫ్ కరీమ్, జూములచే

మాయామోహితుడై, వెఱ్ఱివాడై యున్నా డాతనింగూడ దోడ్కొనిరమ్మని అరిందమ్ చెప్పి, వారికి కారులు సిద్ధపరచి తానును, సిరాజ్ హీన్‌సు, పండిట్ త్రివిక్రమరావును, చంద్ర మాళియు నొక కార్‌లో, సర్కిల్ ఇన్‌స్పెక్టరుగారి యింటికి బోయి, యాయనను దోడ్కొని, ఠాణాదెస బోయి, అక్కడ కొన్ని యేర్పాటులుచేసి, త్వరితగతి నా రెస్టు హౌసును జేరి, అక్కడి నిన్నటి సాయంకాలపు తమ గదితాళము దీయుచు, 'సిరాజ్ హీన్, మీరు మరి నాలుగు రోజు లుండవలెను; తొందరపడి పో నాలోచింపవల దనుచు, వీ రిరువురును లో ప్రవేశింప, 'ఆఁ—ఏమిది? గుల్‌సుమ్ నేల నిటకు రప్పించిరి? ఈగది నేల నుంచిరి? ఛీ! రాణివాసపు తెన్నెరుంగని వచ్చి బాపనయ్యలతో మర్యాదల గూర్చి ప్రసంగ మేల? నాదీ తప్పు.........'

అరిందమ్ అన్యాలోచనాపరుం బోలె వేరుదెస జూచుచు నిలచియుండెను.

'ప్యారీ! మేము పోలీసు స్టేషనుకు బోయి వచ్చునంతలో నిం దేల వచ్చితివి? ఇంటిమర్యాద వీడి, దేశద్రిమ్మరివై, ఒరు నింట గాపురం బుండి, సిగ్గులజ్జల వీడి, విడివడి నిటకు రా దగునా? ఇది నీకు దగవా? ఏమి మాటాడ వేమి? ఊః— ఇంతకును, నిన్నింతకుదెచ్చి, మీరబెట్టిన నరిందమ్ బాబు...

'బాబూ, అరిందమ్‌జీ! అన్నీ బాగున్నవి గాని, రాణి

వానమును రో డ్డెక్కించుట మానితవుగునా ? ఏమిపనియున్న దని యీామె నిటకు రమ్మనిరి ?'

'ఈమె నెవరో రమ్మనిరి ? నే నెరుగను; మీరే యడిగి దెలిసికొనుడు.'

'ఏ మడిగినను, బెల్లముగొట్టిన రాతిరీతి నూరకున్నది; దేశాలంబడి, రో డ్డెక్కి, పరగృహావాసములు జేసినవా రా పిదప తమ భర్తలకే గా దా సురభర్తకైనను లొంగుదురా నరకునేతురా? నే నెరుగనా?'

'ముదిరినది. ఇక నూరకుండ రా' దనుకొని, 'అయ్యో రామాయణ మంతయు విని 'సీతకు రాము డేమగు?' నని ప్రశ్నించినటుల నున్నది. ఇంతసేపును నేమి చెప్పియుంటిని? ఇది, మీ గుల్‌సుమ్ కాదు; ద్రోహిని పట్టుటకు సృజించిన మా గుల్‌సుమ్. ఇందు చిత్రకారుని ప్రజ్ఞావిశేష మశేషము.' అని అరీందమ్ చెప్పుచుండ విని, తన మిత్రవర్గము గూడ వచ్చి, చూచి, ఆశ్చర్యము నొందుచుండ, సిరాజ్‌హీన్ తృప్తి నొందక, తాకిచూచి, నోట మాటలేని ప్రతిమయయ్యెను.

---

## ఐదవ ప్రకరణము

---

పిదప నాగదికి తాళమువేసి యీావలనున్న మృతకళేబరముల దెస నరీందమ్‌సిరాజ్‌హీనులు వచ్చుచుండ, 'అరీందమ్ నీ ధీచాతురియు, నీ మేధాదార్ఢ్యతయు ననుపమాననీయము'

లని తనమిత్రులు గొనియాడుచుండ, నేకడనుండియో, నేకొర
కయిదోగాని, నొక జాగ, భూపరాగం బెగుర బర్వెత్తి వచ్చి,
'ఛీ! ఎంతపనిచేసితివి? ఎంతో మేధావంతుడ వని లోకముచే
నెన్నబడుచున్నా నని గరువమున నున్న నో యరీందమ్, ఎంత
పనిచేసితివి! నీ యట్టి యాచితి నెరింగినవానికిని, గాంభీర్య,
విశాలహృదయునకును, దగనిపని సుమా; నీ భార్యను సుర
క్షితముగ దన తండ్రియింట జేరజేసి, నీకు స్నేహితుడౌ పండిట్
త్రివిక్రమరావునై, నీవిలానమున కంపిన ఏరోప్లేన్ గల యినుప
మందసవు రసజ్ఞతయుం దొక్క యాడుదానికి దీసిపోతివే!
ఠాణాలో నీ యనుగతులును, నీ యనుచరులును, దక్కంగల
పెరవారును తెల్లబోయి చూచుచుండ, మంగళ్సేన్, ఆయినుప
మందసము సమన్వయించి, అందు దిగి, నీకు జూపుచుండ, నీ
పంచభూతాధినాధుండు ఖేచరమార్గంబున విచ్చలవిడి న్విహారిం
చుచుండ, వెల్లంబోయి, మందుడవై, యంధుడవై, విఫలీ
కృతమనోరథుండవై, నీవు మింటిదెన నాశ్చర్యమున జూచు
చుండ, మెకానిన్ వేసమున, నీప్రక్కనే నగుచు, నిలచియున్న
నన్ను బోల్చుకొనజాలకుండిన నీవు, యింకను నె న్నెని విద్యా
బుద్ధులు గరుపవలసియున్న దనియు, నీ కింకను ననుభవము
చాల దనియును, నీకు దెలిపిన, మారులను నేను సుమా! ఈ
పంచభూతాధినాథు నధీనను, పాపమనాశ, నను సనాథం జేసి,
ఎంత కొల కొడిగట్టితివి! ఛీ!............'

'మారులా, కాదు—కాదు; నా పన్నాగ మీతని పన్నాగముల వలెనే, తనను బట్టుటకే గాని, చంపుటకు కాదు; ఆ నాత్మహత్య గావించుకొనెనే గాని, నే నీతని జంపలేదు; నే నీతని యీ యమానుష కార్యమును వారింపకపోలేదు. నీ వెంతమాత్రమును పొరబాటు పడరాదు.'

'ఆహా! నాథా! ఆత్మగౌరవము దక్కించితివి!

'అరీందమ్, మే ముండిన గుహ నీవు చూచియేయుం టివి గదా. దానికి దక్షిణమున నాలుగు మైళ్ళ దూరమున నున్న గుహలో, నాభర్త మరణవార్త వినినదోడన, లెక్కలు చూచి, లాల్‌చంద్ తాలూకు రూ. 39,865-14-6 లును, బ్యాంకినుండి తీసుకొనిపోయిన రూ. ౬,000 లును, ఒక్క చోటనే, పెద్దరాతిగుండువంటి యినుపమందసమున నుంచి, 'పరవిత్తము' అని దానిపై గుర్తించి వచ్చితిని. నీ వటకు పోయి, యద్దానిం గైకొని, లాల్‌చంద్ యొక్క సొమ్మాతని కిచ్చివేసి, నీది నీవుదీసికొని, 'మారుల' వలన మామాసొమ్ము లు వాపసువచ్చిన' వని, నీ యభిమానపత్రిక యగు 'కేసరి' లో బ్రచురింపుము; మరచెద వేమో సుమా!'

మారుల నిజశిరస్థి తాలంకార పద్మరాగమణులు భర్త పాదరాజీవములకు నీరాజనం బిడ, నమస్కరించి,

'ఓ పంచభూతాధినాథా, నాథా, ని న్నెరుంగక, నీ సామర్థ్యము దెలిసికొనజాలక, నీ మేధాశక్తిం దనివార గుర్తిం

పజాలక, బ్రతి పదఘట్టనను, బ్రతిమొత్తునను, బ్రతికార్యమునను ననుక్షణమునను, నీ వొనర్చిన మేలును, లాభమును గ్రహించి, కొనియాడంజాలక, ఇంత లొనర్చిన అరిందమ్‌ను గూర్చి నా మనం బొగులు కన్న, నను నొంటి జేసిపోతివే యని యంతగ విచారింపజాల.

'మన్మమనోనాథ గళ గళ ద్రక్తకాంతి విజిత వారిధను ష్కఖ్ఖాజాలమా, ఓకరవాలమా, నీవెంత ధన్యురాలవు! సృష్టికి బ్రతిసృష్టిగల్పింపగల మన్నాథుని యాత్మకు శాంతిగలుగజేసి, మానవకరముల నీచబాధల దొలగించి, ఆత్మగౌరవము నిలువ బెట్టితివి. నిను బహూకరింప సమర్థమగుమార్గము దోపకున్నది. ఏది యెట్లున్నను, నాయందును గూడ సంపూర్ణ కటాక్షముంచి, మన్నాథుం జేర్పు' మనుచు నట బడియున్న కాలూరాయి కరవాలముం దీసికొని, తన మొల నున్న నదే తరగతి కత్తి నెడమచేత బట్టుకొని, కదనసీముం బీనుగులనడుమ తాండవం బాడుచుండు రణరంగకాళిం బోలె, విరియబోసినకురులతో—

'చలో—జాక్,

అమారా మరద్ కాలూరాయికా పాన్.'

అనుటయు దడవుగాని, తన వక్షోభాగమున బొడిచికొని నిజనాథు పాదములపై కొరగి యసురులం దొరంగుట కేమియు నాలస్యము కానేలేదు. అరిందమ్ మిగుల సాహసించి, మారుల నైనను తా పసి మాన్ప బ్రయత్నించెనే గాని, రెప్పపాటుకాలమున జరిగిన నిక్కార్యమున కేదీ వ్యవధి?

జరుగవలసిన విధు లన్నియు జరిగినవి. పద్ధతు లన్నియు గమనింపబడినవి. కంట కాన్వితం బగు మార్గము రాజమార్గం బయినది. దుర్గమము లన్నియు సుగమము లైనవి.

'కరీమ్, చూచితివా? కాలూరాయిని, మారులను. ఒకప్పుడు నీకు గురూజీ కదూ! అదుగో పడియున్న మిాపతేల్!

'మంగల్సేన్, ఈ కరీమ్ యెవడో పోల్చినావా?'

'బాగా పోల్చలేను గాని, ఒకప్పుడు వీడును ద్రోహకోటిలోనివాడే యని దోచుచున్నది. జమీాలియాకాలమున నామె మిమ్ముల స్మృతి దప్పించిన సందర్భమున నీత డేమైన సంబంధము గలుగజేసికొనెనేమో యని స్ఫురణకు వచ్చుచున్నదే గాని బాగా యాదిలేదు.'

'ఆ సందర్భమున సంబంధము కలుగజేసికొనుట మాత్రమే కాదు——నేను తెలివి తప్పియున్న సమయమున, నదివరకెంతకాలము నుండియో గాని జమల మోహానదృష్టులకు లోనైన యామె యపాంగవీక్షణములకు దాసుడై, ఆమె ముదమందు ననుకొని; ననురైలువచ్చుచున్న సమయములో రైలుపట్టాలమిాద బారవేసి, పోయి, జమలకు నివేదింప నామెచే గౌరవింపబడుటకు మారుగ దూషింపబడిన గులాబ్‌సింగ్ పుఁరఫ్ కరీమ్ యీతడే! పాపము! జమలాక్రాంత మనస్కుండగు నీతడు, జమలాన్వేషణుడై, దేశదేశాల దిరుగుచు, స్మృతి నొందిన జమలా లగ్నమానసుడై, వెఱ్ఱివాడై దిరుగుచు,

మతిభ్రమణము నొందిన దైవోపహతుఁడు. ఈతనికి చక్కని కన్నె నిచ్చి వివాహ మొనర్చవలెను.' అనుచు నరిందమ్మయును తన మిత్రబృందమును, మంగళ్సేనును మగుడి యిలుసేరిరి.

---

## ౩౫వ ప్రకరణము

---

మ. "సరవిన్ వేఁడికి డస్సి శీతలజల ♦ స్నానంబుగా, నిర్మలాం
బరపాళిందడియాఱి, మంచుఁజెమరున్ ♦ మాఘర్త్వానిలంబార్పఁ
గా బురుసా, పట్టుజరీ, బుటాపరికిణీ ♦ ముస్తీబుతోఁ, సాదరా
బురఖాతోడ, జవాహిరీపటలితో ♦ భూకాంతగూడెన్
మధున్.'

భీష్మగ్రీష్మతాపమున కోరువంపాలక, జల్లనిపీట జలక మాడి, నిర్మలాంబరమున దడియాఱి, మంచు జెమ్మటలను మాఘమాసానిలమ్మున నార్చికొని, బురుసా, పట్టుజరీబుటా పరికిణీ ముస్తాబుతో, అపరంజి జవాహిరీ నమూనాహారముతో సాదా బురఖాతో, మాధవుం గూడ నెదురుతెన్నులఁ జూచుచు, సన్నాహ పడుచుండెను.

* * * * *

ఎంతోకాలము గడువలేదు.

బ్యాంకిలో తాను నిలువయుంచుకొనిన సొమ్మున కానాఁడు కాలూరాయి హస్తలాఘవమే సోకకున్నచో,

నానాఁడే కాదగిన సరోజినీ వివాహమహోత్సవ మానాఁ డుత్సాహముగ జరుగవలసియున్నది గాఁబోలు. వధూవరుల తలిదండ్రులు స్వర్ణమయి అరిందమ్‌లును, రత్నాకర్‌సేన్‌లక్ష్మీబాయిలును సమ్మతించుటే గాక, వరుఁడగు మంగల్సేన్ అంగీకార మిదివరకే పొందినదగుట, నీకార్య మిక ననివార్యముగ జరుగగలదని, అరిందమ్ వివాహసన్నాహములు నెరపి, అదివరకేవచ్చియుండిన తన బంధుమిత్రుల సముఖమున, శుభముహూర్తమును, మంగళతూర్యనాదములు సెలంగ, పురోహితాశీః పరంపరలనడుమ, నత్యుల్లాసముగ, నుద్వాహము జయప్రదముగ, గన్నులవైభవముగ, గావించెను.

పిదప కరీమును బిలచి, సృష్టిభావము కొంతదనుక దెలిపి కడుపులో కరుడుగట్టిన దదిమొదలు బొందికి జేటుమూడునని చక్కగ బోధించి, జనులమరణము సత్యమే యనియు, చచ్చినవా రెంతయేడ్చినను మరలిరారనియు, జనుల అసామాన్యమగు భూతగణములో జేరినదిగాని మానవమాత్రురాలు గాదనియు, బోధచేసి, వానిమనసు మరల్చి, చక్కని యాజాతి కన్నెమిన్న నొకరుకం దెచ్చి, యాతనికి 'నీరా' యొసఁగి, ఒకనాటి సాయంకాలమున, స్వజనసమక్షమున, మిత్రగణావృతుండయి, గతకాలమును గూర్చియు, తా నొందిన కష్టపరంపరల గూర్చియు, ద్రోహజనవిరచిత నాటకములం గూర్చియు ముచ్చటించుచు, 'మంగల్సేన్, నాకు కొమరుడవైనను, అల్లుండవు.

యైనది నీవే; నాకు గూతురైనను, గొడుకైనను యీసరోజినియే; నేనిక నీ యుద్యోగమునకు రాజీనామా దాఖలు సేయుచున్నాను. నాకును వయసు మీరినది. ఫూల్‌సాహేబు చమత్కారములు నీ వెరుగకపోయినను, జూముల కాలమునకు బూర్వమునుండియు నాతోపా టెన్నోపాట్లు పడి, నాకు కుడి భుజమవై యుంటివి. ఇప్పుడు నేనును, స్వర్ణమయియు పోయి బ్రహ్మకపాలమున, సర్వజగన్నాటక సూత్రధారియగు నా శ్రీహరిం గూర్చి, తపము జేసికొనుచు వానప్రస్థమున గాలము బుచ్చుచుందుము. ఈ సరోజిని నీ యధీనము—ఈ భవనము నీది—నా స్థిరచరాస్తులు నీవియు—లాల్‌చంద్ సొమ్ము లాల్‌చంద్‌నకు ముట్టినది. నా సొత్తంతయు నీ యధీనము.

'మిత్రులారా, చూచితిరా, దేవుని భావనా చమత్కృతి!

శ్రీలం గోరినభంగి నిచ్చి జనులన్ ◆ జిత్రంబుగా రోసి, దు
శ్శీలుర్ ద్రోహిని వానికార్యముననే ◆ శిక్షాయుతుం జేయుచుం
దాలోలుండయి బ్రోచుచు న్సుజనబృం ◆ దమ్మున్ యశఃకాములన్
లీలం దేల్చెడు నీశుఁడిచ్చు శుభముల్ ◆ నిత్యంబు నిర్వ్యాటికిన్.

'ఎంత మేధాశాలి యైన నేమి; ఎంత ధనవంతుడైన నేమి; ఎంత బలాఢ్యుండైన నేమి; ఎంత వాఙ్నైపుణి గలవాడైన నేమి; దురంతరకార్యములు జేయ యత్నించుచు కొంత దూరము జయమొంది తుదకు, తన కార్యములపట్లనే, తన

కార్యముల కుత్సితమార్గములను యురులచే పట్టుబడి యనంతర మంతమొందెను. భగవంతుఁడు సిరి సంపదలను జనులు కోరిన రీతి నిచ్చి, తా నొసంగిన సంపదలను సద్వినియోగము సేసెనేని, యట్టివారలకు సద్గతులు గల్పించుచు, నటుగాక, తానిచ్చిన సంపదల దుర్వినియోగ మొనర్చుచో, వారి వారి కార్యముల పట్లనే, వారిని శిక్షాయుతులుగ నొనరుచు నేర్పుగల భగవంతుని చర్యలు దుర్భేద్యములు గదా! ద్రోహచింతలు గలవారి పాట్లు దెలిసికొనుటకు, కాలూరాయి దుర్గతియే మనకు నుదాహరణమాయె గదా!

'కాని, జూమలబినెస్లెత్‌లను మించిన అద్వితీయుఁడై, బహు మేధాశాలియైన వ్యక్తి గతించినందుల కెంతేని విచారించుచున్నాను.

'సిరాజ్‌హీన్, మీకష్టములు గట్టెక్కినవి. ఇక మీరును గుల్‌సుమ్‌యును, మీ యిచ్చవచ్చినప్పుడు బయలుదేరి, మీ రాజ్యమున సుఖ ముండుఁడు.

మిత్రులారా,

'నాతోపాటు మీరందరునుగూడ—గడచినది గడచినది గాని—యిపుడు సరోజిని వివాహమును కాజేయించినందుల కెంతేని కృతజ్ఞుడను.

'ఇన్నేళ్ళు గొలువున నుండియు, నిన్నేళ్ళు జీవించియు, నిప్పటికే నొనర్చిన గార్య మొక్కటియు లేదు; ఇకముం దెవ్వారి

రక్షింపగలను. రక్షాశిక్షలే మానవు హస్తగతంబు లైననాడు, మరి సృష్టికర్తయేల? ఇం కెంతకాల మున్నను జీవికి ఐహిక కార్యముల బరమావధి గానరాదు. కావున భార్యాసహితమ్ముగ నేను బ్రహ్మకపాలమునకు బోయి వానప్రస్థమున నా శేషించిన గాలము పుచ్చపో బోనున్నాను. నేనును తమకు గృతజ్ఞతాభివందనము లొనర్చి శలవు గైకొనుచున్నాను.'

## సింహావలోకనము

పాఠకులారా,

మీకు చాల యాయాసమైనది; కథయు నంత మైనది. తిప్పాలతమాషాలలో భ్రమపడి; స్వయంకృతాపరాధమున విస్మయమొంది; ఎత్తుపైయెత్తుల కామోదమొంది; కథలో చిత్రకథంగల నాటకాం తర్నాటకమ్ములకు మనమ్ముల నక్కజమ్మొంది; మోహాంధత కెకనక్క-మొనర్చి; భిన్నభిన్నములై, విచిత్రముతో నెదురునన్నాహములకు గుతూహలులమై; పటేల్, కాలూరాయి, మారుతుల యాకస్మికమరణముల కెంతేని విషాదమొంది; గుల్సుమ్‌సిరాజ్‌హీనుల కొం డొరులకు గలిగిన పునర్దర్శన లాభములకు సంతసమొంది, సరోజినీమంగత్సేనుల వివాహముల నారసి; అకరాచిస్వామిద్రోహమును, పటేల్ పరస్త్రీవాంఛాలోలత్వమును, కాలూరాయి ధనకాంక్షయును, తల్లాభములును జూచినాము గదా!

ఇక నేమున్నది? అంతా యింతే!

# నవలలు

| ఆంధ్ర ప్రచారిణీ లిమిటెడ్ వారి | | రు | అ |
|---|---|---|---|
| మాయావి | 1 వ భా | 1 | 8 |
| మనోరమ | 2 ,, | 1 | 8 |
| మాయావిని | 3 ,, | 0 | 12 |
| ఫాదుషా హైదరాలి | | 1 | 8 |
| ప్రణయచాంచల్యము | | 1 | 8 |
| సాహసిక | | 1 | 0 |
| వీరపూజ | | 2 | 0 |
| సురస | | 1 | 0 |
| అమరవిజయం | | 1 | 0 |
| కావ్యకుసుమావళి | 1 వ భా | 4 | 0 |
| డిటో | 2 ,, | 4 | 0 |
| **చరిత్రాత్మక నవలలు** | | | |
| వనదుర్గము | | 1 | 8 |
| తపోవనము | | 1 | 8 |
| జపమాలిక | 1 వ భా | 1 | 0 |
| డిటో | 2 ,, | 1 | 0 |
| డిటో | 3 ,, | 1 | 1 |
| తానీషా | | 1 | 0 |
| ఇచ్ఛినీకుమారి | | 1 | 0 |
| ధర్మరాజు | | 1 | 0 |
| ప్రతిబింబములు (మో॥ నరసింహశాస్త్రి) | | 1 | 0 |
| హోతింతాయి | | 0 | 12 |
| స్వర్ణకుమారి | 1 వ భా | 1 | 0 |
| డిటో | 2 ,, | 1 | 0 |
| ప్రసన్నముఖి | | 1 | 0 |

| సరస్వతీ గ్రంథమండలివారి నవలలు | | రు | అ |
|---|---|---|---|
| హత్యారహస్యము | | 1 | 0 |
| కుముద్వతి | | 1 | 0 |
| సింహగడము | | 1 | 0 |
| మణిహారము | | 1 | 0 |
| ఛిన్నహస్తము | 1 వ భా | 1 | 0 |
| సంజీవి | 1 ,, | 1 | 8 |
| సంజీవి | 2 ,, | 1 | 8 |
| ప్రజారాణి | | 1 | 8 |
| కాశీఖండము | | 1 | 0 |
| సేవాశ్రమము | 1 వ భా | 1 | 0 |
| సేవాశ్రమము | 2 ,, | 1 | 0 |
| అంతఃపురము | 1 వ భా | 1 | 0 |
| అంతఃపురము | 2 ,, | 1 | 0 |
| స్వాత్మభ్రమ | | 1 | 0 |
| మేరీరాణి | | 1 | 0 |
| రాజ్యలక్ష్మి | | 1 | 0 |
| పినురునియుపదేశములు | | 0 | 12 |
| కాంచనమాల | | 1 | 0 |
| సీమంతిని | | 1 | 0 |
| సుశీల | | 0 | 12 |
| యమునాబాయి | | 0 | 12 |
| శ్యామల | | 1 | 0 |
| కాంతం కథలు (చిన్నకథలు) | | 0 | 12 |
| కాలసర్పి | | 0 | 12 |
| ప్రేమసుందరి | | 1 | 0 |
| ఫాస్టు | 1 వ భా | 1 | 0 |

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో, రాజమండ్రి.